# To whom so it may concern ...!

You can save Family / Friends / Students if you realize on Cybercrimes as early as possible only by guiding them properly by experts

Almost Everybody is using Mobile, andintern many of them are using social media..! With lack of proper guidance/awareness many of the citizens are losing time / money / dignity and sometimes lives too.

As per the Mint newspaper survey 60% of the Indians are trapped by the cyber crooks in the last one year.

www.madhavareddy.org

As per records citizens lost 4,000 crores “ONLY” in Hyderabad, off the records it could be more than 10 times. In addition to that physical / mental agony and loosing lives also.

Below are few Cyber Crimes clips collected for your reference from the newspapers.

**Check the newspaper daily for more information**

# Cyber Crimes through Social Media

## (Facebook,Instagram,Whatsapp etc.,)



### ఫేస్ బుక్‌లో ట్రాప్ చేసి
## రూ. కోటి కొట్టేసిండు

- 'కళ్యాణి శ్రీ' పేరుతో చాటింగ్
- నిందితుడితో పాటు అతడి భార్యను అరెస్ట్ చేసిన పోలీసులు

దాసు  జ్యోతి

హైదరాబాద్,వెలుగు: ఫేక్ ఫేస్‌బుక్ ఐడీతో యువతను ట్రాప్ చేస్తున్న దంపతులను సిటీ సైబర్ క్రైమ్ పోలీసులు మంగళవారం అరెస్ట్ చేశారు. నిందితుల నుంచి సెల్‌ఫోన్స్ స్వాధీనం చేసుకున్నారు. సైబర్ క్రైమ్ ఏసీపీ కేవీఎం ప్రసాద్ వివరాలు వెల్లడించారు. ఏపీలోని గుంటూరు జిల్లాకు చెందిన ఎర్రగుడ్ల దాసు నూజివీడు ఐఐఐటీలో బీటెక్ చదివాడు. 2014లో కొండాపూర్‌లోని టీసీఎస్ కంపెనీలో జాయిన్ అయ్యాడు. ఖాళీగా ఉన్న సమయాల్లో ఆన్‌లైన్ రమ్మీ ఆడేవాడు. 6 నెలల తర్వాత జాబ్ పోయింది. ఆన్‌లైన్ రమ్మీ, కార్డ్స్ ఆడేందుకు ఫ్రెండ్స్,బంధువుల దగ్గర అప్పులు చేశాడు. హైదరాబాద్ నుంచి సొంతూరికి వెళ్లిపోయాడు. 2017లో జ్యోతి అనే యువతిని పెండ్లి చేసుకున్నాడు. 2019లో దంపతులు ఇద్దరు సత్తెనపల్లికి షిఫ్ట్ అయ్యారు. అక్కడ దాసు ఫ్రూట్ వెండర్‌గా పనిచేశాడు. వచ్చిన డబ్బుతో ఆన్ లైన్ రమ్మీ ఆడేవాడు. ఆన్‌లైన్ రమ్మీ బ్యాన్ కావడంతో క్రికెట్ బెట్టింగ్ పెట్టేవాడు. బెట్టింగ్ ల కారణంగా ఆర్థిక ఇబ్బందుల్లో పడ్డాడు. 'కళ్యాణి శ్రీ' పేరుతో ఫేక్ ఫేస్‌బుక్ అకౌంట్ క్రియేట్ చేసి యువతను ట్రాప్ చేసేందుకు స్కెచ్ వేశాడు. గతేడాది మేలో సికింద్రాబాద్‌కు చెందిన విజయ్ రెడ్డిని ట్రాప్ చేశాడు.పెండ్లి చేసుకుంటానని ఏడాది పాటు అమ్మాయి లాగా చాట్ చేశాడు. ల్యాండ్ సెటిల్‌మెంట్ కోసం డబ్బులు కావాలని రిక్వెస్ట్ చేసి గతేడాది మే నుంచి విజయ్ రెడ్డి దగ్గరి నుంచి సుమారు రూ.కోటి క్యాష్‌ను దాసు తన భార్య జ్యోతి అకౌంట్‌కి ట్రాన్స్ ఫర్ అయ్యేలా చేశాడు. ఆ డబ్బుతో దాసు దంపతులు సత్తెనపల్లిలో ల్యాండ్ కొన్నారు. వీరి చేతిలో మోసపోయిన విజయ్‌రెడ్డి సిటీ సైబర్ క్రైమ్ పోలీసులకు ఈ నెల 12న కంప్లయింట్ చేశాడు. ఇన్‌స్పెక్టర్ జి.వెంకట్‌రెడ్డి ఆధ్వర్యంలోని టీమ్ కేసు దర్యాప్తు చేసింది.బ్యాంక్ అకౌంట్స్,ఐపీ అడ్రెస్ ఆధారంగా నిందితులను అరెస్ట్ చేసింది.



## మాయచేసి.. మభ్యపెట్టి..

- 60 మంది యువతుల నుంచి రూ.4 కోట్లు వసూలు
- అమ్మాయి మాదిరిగా నకిలీ ఇన్‌స్టాగ్రామ్ ఖాతాలు
- వీటితో పరిచయమైన యువతులకు కుచ్చుటోపీ
- కస్టడీలోకి తీసుకుని సిటీ సైబర్ కాప్స్ విచారణ

పోలీసుల అదుపులో వంశీకృష్ణ (ఎడమ)



## అందమే పెట్టుబడిగా మహిళలపై వల

- సామాజిక మాధ్యమాల్లో పరిచయాలు
- నగ్నచిత్రాల సేకరణ.. వాటితో బ్లాక్‌మెయిల్
- బాధితులు 300 మంది
- మోసగాడి అరెస్టు..

నిందితుడు ప్రసన్నకుమార్



## ముస్తాబు డీపీలతో.. అమ్మాయిలకు టోపీ..!

మిలిటరీ అధికారినంటూ యువతులకు వల

పెళ్లి చేసుకుంటానని రూ.6 కోట్లు స్వాహా

నిందితుడు ముదావత్ శ్రీను నాయక్

www.madhavareddy.org



## ధనవంతుల కుమార్తెలకు వల

- ఫేస్‌బుక్‌లో ఫొటోలు, వివరాలు సేకరించి డబ్బుల కోసం వేధింపులు
- లేదంటే ఫొటోలు మార్చి సామాజిక మాధ్యమాల్లో పెడతానని తల్లిదండ్రులకు బెదిరింపులు
- వలవేసి పట్టుకున్న కేపీహెచ్‌బీ పోలీసులు

విద్యాసాగర్



## యువతులే టార్గెట్

- ఇన్‌స్టాగ్రామ్ అడ్డాగా మోసాలు
- వందమందికి పైగా బాధితులు
- నిందితుడి అరెస్ట్
- తెలుగు రాష్ట్రాల్లో కేసులు
- పలుమార్లు జైలుకెళ్లొచ్చినా మారని బుద్ధి

నాలుగు ఐడీలతో..

CYBERABAD POLICE

# Cyber Crimes (Job Frauds)

FRAUD ALERT

## నవల్స్ పేరుతో నయా వంచన!

- వర్క్ ఫ్రం హోం పేరుతో యూఎస్ కంపెనీ ఎర
- ఒక్కో పేజీకి రూ.5 చొప్పున కమీషన్
- తొలుత డిపాజిట్ కింద రూ.లక్ష కట్టించుకున్న కంపెనీ
- జూన్‌లో రూ.5.5లక్షలతో మరో కొత్త స్కీంతో మోసానికి శ్రీకారం
- వేతనాలు నిలిపివేయడంతో బాధితుల ఆగ్రహం
- 200మంది నుంచి రూ.30కోట్లు స్వాహా
- ఢిల్లీకి చెందిన అమిత్‌శర్మపై ఫిర్యాదు

హిమాయత్‌నగర్: ప్రముఖ నవలలను సాఫ్ట్ కాపీల్లో తయారు చేయాలంటూ పేపర్, టీవీ, సోషల్ మీడియా ద్వారా యాడ్స్ ఇచ్చి నయా వంచనకు తెరతీశారు యూఎస్‌కు చెందిన 'డిజినల్ ఇండియా ప్రైవేటు లిమిటెడ్ కంపెనీ' నిర్వాహకులు. ఒక్కో పేజీకి రూ.5 చొప్పున ఇస్తామని గృహిణులను టార్గెట్ చేసుకుని కోట్ల రూపాయలు దండుకున్నారు. చేసిన పనికి సరైన రీతిలో లాభాలు, వేతనాలు ఇవ్వకపోవడంతో మనదేశంలో ఈ కంపెనీని నిర్వహిస్తున్న ఢిల్లీకి చెందిన అమిత్‌శర్మపై బాధితులు బుధవారం సీసీఎస్ జాయింట్ సీపీ గజరావు భుపాల్‌కు ఫిర్యాదు చేశారు. బాధితులు ప్రవంతి, కిషోర్, శ్రీనివాసరావు, సునీల్‌సింగ్, వికాస్, మనోజ్, వెంకటేశ్వర్లు కథనం మేరకు వివరాలిలా ఉన్నాయి..కొన్ని నెలల క్రితం యూఎస్‌కు చెందిన 'డిజినల్ ఇండియా ప్రైవేటు లిమిటెడ్' కంపెనీ నిర్వాహకులు వర్క్ ఫ్రం హోం పేరుతో ప్రకటనలు ఇచ్చారు. పలు ప్రముఖ నవల్స్‌ను ఇచ్చి వాటిలో ఉన్న ఒక్కో పేజీని పీడీఎఫ్‌గా మార్చి కంపెనీకి సబ్‌మిట్ చేయాలి. ఒక్కో పేజీకి రూ.5 కమీషన్ ఇచ్చేందుకు బాధితులతో ఒప్పందం కుదుర్చుకున్నారు. ఇందుకు గాను రూ.లక్ష డిపాజిట్ చేస్తే తమ కంపెనీ నుంచి ఒక స్కానర్ ఇస్తామన్నారు.దీంతో పలువురు మహిళలు డిపాజిట్ చేశారు. దీంతో వారికి వారు చేసిచ్చిన పనికి సంబంధించి వేతనం, లాభాలు సైతం ఓ మూడు నెలల పాటు ఇవ్వడం జరిగింది. జూన్ నెలలో టూ పాయింట్ ఓ(2.0) పేరుతో అమిత్‌శర్మ మరో స్కీంను ప్రవేశపెట్టారు. ఈ ప్రాజెక్టుకు రూ.5.50 లక్షలు డిపాజిట్ చెల్లించాలని చెప్పడంతో ప్రస్తుతం వీరికింద చేస్తున్న వారు ఆసక్తి కనబరిచారు. వీరు కట్టడమే కాకుండా తమ బంధువులు, స్నేహితులను కూడా ఈ స్కీంలో చేర్పించారు. నెల గడిచినా చేసిన పనికి వేతనాలు ఇవ్వకపోవడంతో బాధితులు అమీర్‌పేట, బంజారాహిల్స్‌లోని కార్యాలయాల వద్దకు వెళ్లి నిలదీశారు. అక్కడ పని చేస్తున్న సిబ్బంది తమకేమీ తెలిదనడంతో అమిత్‌శర్మకు ఫోన్ చేయగా స్విచ్ఛాఫ్ వచ్చింది. ఆగ్రహించిన బాధితులు ఫర్నిచర్‌ను ధ్వంసం చేశారు. అనంతరం సీసీఎస్ జాయింట్ సీపీ గజరావు భుపాల్‌కు ఫిర్యాదు చేశారు. కేసు నమోదు చేసి దర్యాప్తు చేస్తున్నట్లు జాయింట్ సీపీ తెలిపారు.

## ఆన్‌లైన్ మోసానికి సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని బలి!



శ్వేతా చౌదరి

జగ్గయ్యపేట, న్యూస్‌టుడే: ఆన్‌లైన్ మోసానికి గురైన సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని బలవన్మరణానికి పాల్పడిన ఘటన ఎన్టీఆర్ జిల్లా జగ్గయ్యపేట మండలం చిల్లకల్లులో చోటుచేసుకుంది. ఎస్సై చినబాబు తెలిపిన వివరాల ప్రకారం.. గుంటూరు జిల్లా మంగళగిరి మండలం నవులూరుకు చెందిన జాస్తి శ్వేతా చౌదరి (22) హైదరాబాద్‌లోని ఓ సంస్థలో సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని. మూడు నెలలుగా ఇంటి నుంచే పని చేస్తోంది. సంస్థ కార్యాలయంలో నేరుగా విధులు నిర్వర్తించేందుకు ఆదివారం తెల్లవారుజామున బంధువులతో కలిసి కారులో హైదరాబాద్ వెళ్లేందుకు సిద్ధమైంది. శనివారం సాయంత్రం 5 గంటలకు స్కూటీపై బయటకు వచ్చింది. రాత్రి 8 గంటల సమయంలో తాను చిల్లకల్లు చెరువులో దూకి ఆత్మహత్య చేసుకుంటున్నానని తల్లి ఫోన్‌కు సందేశం పంపింది. తిరిగి ఫోన్ చేస్తే స్విచ్ఛాఫ్ రావడంతో తల్లిదండ్రులు హుటాహుటిన చిల్లకల్లు వచ్చి పోలీసులకు ఫిర్యాదు చేశారు. శనివారం రాత్రి గాలించినా ఫలితం లేకపోయింది. ఆదివారం ఉదయం 10 గంటల సమయంలో మృతదేహం లభించింది. వివరాలు సేకరించిన పోలీసులు.. ఆన్‌లైన్ మోసమే ఆత్మహత్యకు కారణమని ప్రాథమిక అంచనాకు వచ్చారు. అపరిచిత వ్యక్తి ఆన్‌లైన్‌లో ఆమెకు పరిచయమై రూ.1.2 లక్షలు చెల్లిస్తే.. రూ.7 లక్షలు తిరిగి వస్తాయని ఆశ చూపాడు. ఆమె తనవద్ద డబ్బుల్లేవని చెప్పింది. ఆ వ్యక్తే రూ.50వేలు ఆమె ఖాతాకు పంపాడు. మిగిలిన మొత్తం కలిపి తాను చెప్పిన ఖాతాకు పంపమన్నాడు. దశల వారీగా మరో రూ.1.3 లక్షలు కట్టించాడు. రెండు రోజులుగా ఆ వ్యక్తి ఫోన్ ఎత్తకపోవడంతో తీవ్ర ఆందోళనకు గురైన శ్వేత... ఆ కారణంగానే ఆత్మహత్యకు సిద్ధపడి ఉంటుందని, మరిన్ని వివరాల కోసం ప్రయత్నిస్తున్నామని ఎస్సై చెప్పారు.

www.madhavareddy.org




## రూ.14.40 లక్షల టోకరా

తడ: ఆన్‌లైన్ ట్రేడింగ్ పేరుతో మండలానికి చెందిన వ్యక్తికి సైబర్ నేరగాళ్లు ఏకంగా రూ.14.40 లక్షలు టోకరా వేశారు. ఆలస్యంగా తెలుసుకున్న బాధితుడు మంగళవారం పోలీసులను ఆశ్రయించాడు. ఎస్సై జేపీ శ్రీనివాసరెడ్డి వివరాల మేరకు.. పూడి సమీపంలోని లేక్ వ్యూ అపార్ట్‌మెంట్‌లో నివాసం ఉంటున్న విశ్వనాథ్, జాతీయ రహదారి పక్కన ఉన్న రాయల్ టూల్స్‌లో మేనేజర్‌గా పని చేస్తున్నాడు. గత మార్చి 30వ తేదీన మలేషియా కౌలాలంపూర్‌కి చెందిన ఎమిలీ చాన్ అనే మహిళ వాట్సప్‌లో పరిచయమైంది. కొప్పెల్ డైమండ్ అనే కంపెనీలో పెట్టుబడి పెట్టి భారీ ఆదాయం సంపాదించవచ్చని నమ్మించింది. కంపెనీలో 103 మంది ఉద్యోగులు ఉన్నారని, తాను వజ్రాల వ్యాపారం చేస్తానంటూ డైమండ్ ఆన్‌లైన్ వెబ్‌సైట్ అడ్రస్ వివరాలు తెలిపింది. వాటిని నమ్మిన విశ్వనాథ్, వాళ్లు ఇచ్చిన అడ్రస్ ప్రకారం ఆర్‌సీఎల్ బిజినెస్ బజార్‌కి సంబంధించిన ఐసీఐసీఐ బ్యాంక్ ఖాతాలో రూ.6.40 లక్షలు, హరి ఓం ఎంటర్ ప్రైజెస్‌కి సంబంధించిన ఐసీఐసీఐ బ్యాంక్ ఖాతాలో రూ.8 లక్షలు పెట్టుబడి పెట్టాడు. ఆన్‌లైన్ ట్రేడింగ్ ద్వారా రూ.12.28 లక్షలు ఆదాయం సంపాదించాడు. తనకు డబ్బు అవసరమవడంతో రూ.4.75 వేలు విత్ డ్రా చేసుకుంటానని ఎమిలీ చాన్‌ని కోరాడు. ఆమె అంగీకరించడంతో విత్‌డ్రా చేసుకునేందుకు బ్యాంక్‌కు వెళ్లాడు. అమౌంట్ కనిపించకపోవడంతో వెబ్‌సైట్ చెక్‌చేశాడు. అది పనిచేయక పోవడంతో ఎమిలీ చాన్‌గా పరిచయం అయిన మహిళకు ఫోన్ చేయగా ఫలితం లేకపోయింది. దీంతో మోసపోయానని గ్రహించిన విశ్వనాథ్ పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

# Cyber Crimes (Loan Apps)



## మిత్రుల నగ్నచిత్రాలు..
# ఫొటోలకు పూలదండలు

- రుణయాప్ బాధితులకు కొత్త తరహా వేధింపులు
- 6 నెలల్లో 150 కిపైగా ఫిర్యాదులు

**మార్ఫింగ్.. బ్లాక్‌మెయిలింగ్**

**కట్టడి చేసేదెలా..**

ఈనాడు, హైదరాబాద్

## రుణయాప్ నిర్వాహకుల వేధింపులకు వివాహిత బలి

### ఇంట్లో ఉరేసుకుని బలవన్మరణం



ప్రత్యూష మృతదేహం

మంగళగిరి (తాడేపల్లి), న్యూస్‌టుడే: రుణయాప్‌ల నిర్వాహకుల వేధింపులకు ఓ వివాహిత బలైపోయారు. తీసుకున్న రుణం చెల్లిస్తున్నప్పటికీ యాప్ నిర్వాహకులు క్రూరంగా వేధించడంతో బలవన్మరణానికి పాల్పడ్డారు. పోలీసుల కథనం ప్రకారం.. మచిలీపట్నానికి చెందిన ప్రత్యూష (23)కు ఘంటశాల మండలం చిన్న కళ్లేపల్లికి చెందిన రాజశేఖర్‌తో ఆరేళ్ల క్రితం వివాహమైంది. మంగళగిరి మండలం హాయ్‌ల్యాండ్ సమీపంలో ఓ ఇంటిని అద్దెకు తీసుకుని ఉంటున్నారు. రాజశేఖర్ ఏపీఐఐసీలో ప్రాజెక్టు ఇంజినీర్‌గా పనిచేస్తున్నారు. ప్రత్యూష గృహిణి. ఇండియాబుల్స్ అనే యాప్ తోపాటు మరో యాప్ నుంచి రుణం తీసుకున్న ఆమెను.. యాప్ నిర్వాహకులు విపరీతంగా వేధించారు. ఇంట్లో బంగారు నగలు కూడా తాకట్టు పెట్టి ఆమె రుణయాప్ నిర్వాహకులకు రూ. 70 వేలు చెల్లిస్తూ వచ్చారు. తీసుకున్న రుణం కంటే అదనంగా కట్టినా ఇంకా చెల్లించాలని, లేదంటే ఫొటోలు మార్ఫింగ్ చేస్తామంటూ భయపెట్టారు. దీంతో భయాందోళనలకు గురైన ప్రత్యూష జరిగిన విషయాన్ని వివరిస్తూ ఆత్మహత్య చేసుకుంటున్నట్లు సెల్ఫీ వీడియో తీసుకుని హైదరాబాద్‌లోని తండ్రి సుధామృతరావుకు వాట్సాప్ పంపారు. 'ఉదయం 7గంటల కల్లా తీసుకున్న రుణం చెల్లించకపోతే నా ఫొటో మార్ఫింగ్ చేసి అందరికీ పంపుతామంటూ బెదిరిస్తున్నారు. తీసుకున్న రుణం చెల్లించినా ఇంకా చెల్లించాలంటూ వేధిస్తున్నారు. వారి వేధింపులు భరించలేక పోతున్నాను. వేరే దారిలేదు. నేను వెళ్లిపోతున్నాను. అన్నా జాగ్రత్త, అమ్మానాన్నలను జాగ్రత్తగా చూసుకో. డాడీ సారీ' అని దానిలో చెప్పారు. 'రుణ యాప్ ద్వారా మా ఫ్రెండ్ రుణం తీసుకుంది. వేధిస్తున్నారని నీకు చెప్పాను. అది ఫ్రెండ్ గురించి కాదు. నా గురించే. నా బంగారం ఓ ప్రైవేటు ఫైనాన్స్ కంపెనీలో తనఖా పెట్టాను. వాటి పత్రాలు ఫలానా చోట పెట్టాను' అంటూ భర్తకు మరో సెల్ఫీ వీడియో పంపారు. అనంతరం డాబాపైకి వెళ్లి పైన హోర్డింగ్ ఇనుప గడ్డర్లకు ఉరివేసుకుని బలవన్మరణానికి పాల్పడ్డారు. కుమార్తెకు వెంటనే ఫోన్ చేసినా సమాధానం లేకపోవడంతో ఆమె కుటుంబసభ్యులు హుటాహుటిన బయల్దేరి హైదరాబాద్ నుంచి చిన్నకాకాని చేరుకున్నారు. పోలీసులు ఘటనాస్థలికి చేరుకుని మృతదేహాన్ని మంగళగిరి ప్రభుత్వ వైద్యశాలకు తరలించారు.

www.madhavareddy.org

## రుణయాప్ ఆగడాలకు యువకుడి బలి

- కుటుంబసభ్యులకూ తప్పని వేధింపులు



కోనా సతీశ్

కడియం, న్యూస్‌టుడే: రుణ యాప్ సంస్థల ఆగడాలకు ఓ యువకుడు బలైపోయిన దారుణమిది. యువకుడు బతికే ఉన్నాడనుకొని, అతని సెల్‌ఫోన్‌కు ఇంకా మెసేజ్‌లు పంపడంతో ఆత్మహత్యకు కారణం బయటపడింది. పోలీసులు, బాధితుల కథనం మేరకు.. తూర్పుగోదావరి జిల్లా కడియం మండల కేంద్రానికి చెందిన కోనా సతీశ్(28) పీజీ చదివాడు. స్వతహాగా మృదుస్వభావి. తండ్రి పూలవ్యాపారి కాగా, తల్లి గృహిణి. సెల్‌ఫోన్‌లో చూసి చదువుల కోసమని ఓ లోన్‌యాప్‌లో కొంత రుణం తీసుకున్నాడు. తిరిగి చెల్లించాలంటూ యాప్ నిర్వాహకులు అతడిపై తీవ్ర ఒత్తిడి తెచ్చారు. నగ్నంగా ఉన్న వేరే చిత్రానికి సతీశ్ తల అతికించి వాటిని ఇతరుల వాట్సాప్ నంబర్లకు పంపించారు. ఆ విషయం తెలిసి సతీశ్ తీవ్ర మానసిక క్షోభకు గురయ్యాడు. ఈ నెల 24న సినిమాకు వెళ్తున్నానని ఇంట్లో చెప్పి బయటకెళ్లి, అదేరోజు రాత్రి భీమవరం సమీపంలో రైలు కిందపడి ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ విషయం మరునాడు కుటుంబసభ్యులకు తెలిసింది. మరోవైపు అప్పు చెల్లించాలంటూ సతీశ్ కుటుంబసభ్యులకు ఈ నెల 26 నుంచి సెల్‌ఫోన్ సందేశాలు వస్తూనే ఉన్నాయి. మార్ఫింగ్ చేసిన సతీశ్ నగ్నచిత్రాలు సైతం పంపిస్తున్నారు. అప్పు కట్టకుంటే కుటుంబసభ్యుల ఫొటోలు కూడా అందరికీ పంపిస్తామని బెదిరిస్తున్నారు. దీంతో బాధిత కుటుంబం కడియం పోలీసులను ఆశ్రయించింది. దీనిపై ఫిర్యాదు అందిందని, దర్యాప్తు చేస్తామని కడియం సీఐ రాంబాబు తెలిపారు.




**RR: 'నీ భార్య న్యూడ్ ఫొటోలు వెబ్‌సైట్‌లో పెట్టు'**

రాజేంద్రనగర్ పరిధి జల్‌పల్లి వాసి సుధాకర్ (33) అగ్నిమాపక శాఖ కానిస్టేబుల్‌గా పనిచేస్తూ ఇటీవల గోల్డెన్ రూపీ అనే యాప్‌లో రూ.6 వేలు లోన్ తీసుకున్నాడు. సొమ్ము చెల్లించినా బాకీ ఉన్నావంటూ యాప్ నిర్వాహకులు వేధించారు. 'నీ భార్య నంబర్, న్యూడ్ ఫొటోలు అశ్లీల వెబ్‌సైట్‌లో పెడితే.. ఒక్కో కస్టమర్ నుంచి రూ.1000 వస్తాయని' మెసేజ్‌లు రావడంతో మనస్తాపం చెందిన సుధాకర్ శాస్త్రిపురంలో రైలు కిందపడి సూసైడ్ చేసుకున్నాడు.

## నా ఆత్మహత్యకు వారే కారణం..

- యాప్ లోన్స్, క్రెడిట్ కార్డుల ఏజెంట్ల వేధింపులు తాళలేక వ్యక్తి ఆత్మహత్య
- ఆన్‌లైన్ గేమ్స్‌కు బానిసై.. డబ్బు కట్టలేక బలవన్మరణం

రాజేంద్రనగర్: బ్యాంకు క్రెడిట్ కార్డు, యాప్ లోన్స్ రికవరీ ఏజెంట్ల వేధింపులు భరించలేక ఓ వ్యక్తి ఆత్మహత్య చేసుకున్నాడు. రాజేంద్రనగర్ పోలీస్‌స్టేషన్ పరిధిలో ఈ సంఘటన చోటు చేసుకుంది. ఇన్‌స్పెక్టర్ క్రాంతికుమార్ తెలిపిన మేరకు.. కర్ణాటక రాష్ట్రానికి చెందిన దత్తాత్రేయ(32) కుటుంబం అత్తాపూర్ పాండురంగానగర్ ప్రాంతంలో నివసిస్తుంది. దత్తాత్రేయ నగరంలోని ఓ నగల దుకాణంలో సేల్స్‌మన్‌గా పని చేస్తున్నాడు. ఇతడికి భార్య, ఇద్దరు సంతానం. ఇటీవల దత్తాత్రేయ సెల్‌ఫోన్‌లో ఆన్‌లైన్ గేమ్స్‌కు అలవాటు పడ్డాడు. రెండు యాప్‌ల ద్వారా ఆన్‌లైన్ బెట్టింగ్‌లకు పాల్పడ్డాడు. ఇలా బానిసై జూన్ వరకు రూ. ఏడు లక్షల వరకు అప్పులు చేశాడు. ఆ తరువాత మూడు క్రెడిట్ కార్డులు, రెండు లోన్ యాప్స్ ద్వారా డబ్బు తీసుకొని బెట్టింగ్ ఆడాడు. రుణం చెల్లించకపోవడంతో బ్యాంకు ఏజెంట్లతో పాటు లోన్ యాప్ నిర్వాహకులు డబ్బు కట్టాలని ఫోన్ చేస్తున్నారు. వీరి వేధింపులు తాళలేక మానసిక వేదనకు గురయ్యాడు. సెల్‌ఫోన్‌ను ఆఫ్ చేయడంతో బంధువులతో పాటు కుటుంబ సభ్యులకు రికవరీ ఏజెంట్లు ఫోన్‌లు చేస్తుండడంతో ఇంటి వద్దే ఉంటున్నాడు. గురువారం సాయంత్రం భార్య పనికి వెళ్లగా ఇంట్లో ఉరి వేసుకొని ఆత్మహత్య పాల్పడ్డాడు. సాయంత్రం ఇంటికి వచ్చిన భార్య భర్త ఉరికి వేలాడుతూ కనిపించడంతో అత్తాపూర్ ఔట్ పోస్టు పోలీసులకు సమాచారం అందించింది. పోలీసులు వచ్చి మృతదేహాన్ని మార్చురీకి తరలించారు. మృతుడు తన సూసైడ్ నోట్‌లో తన మృతికి ఆన్‌లైన్ బెట్టింగ్‌తో పాటు లోన్‌లు, క్రెడిట్ కార్డులు కారణమని తనను వేధించిన వారిపై చర్యలు తీసుకోవాలని రాశాడు. కేసు నమోదు చేసిన పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు.



దత్తాత్రేయ (ఫైల్)



దత్తాత్రేయ రాసిన సూసైడ్ నోట్

**Proper Awareness on Cyber crimes is only Solution ...!**

# Cyber Crimes (Lottery)

తాడిపత్రి / గుంతకల్లు / శింగనమల

## సైబర్ చోర్




లక్కీడ్రాలో కారు గిఫ్ట్ వచ్చినట్లు సైబర్ నేరగాళ్లు పంపిన నకిలీ బ్రోచర్

- కనిపించని దొంగలతో తస్మాత్ జాగ్రత్త!
- అమాయక ప్రజలే లక్ష్యంగా మోసాలు
- క్షణాల్లో నగదు మాయం

పుట్లూరు: సైబర్‌నేరగాళ్లు కనిపించని దొంగలు. అజ్ఞానులైనా, విద్యావంతులైనా.. ఎవరైనా సరే అమాయకంగా ఉన్నారంటే అంతేసంగతులు. క్షణాల్లో బ్యాంకు ఖాతాలను ఖాళీ చేస్తున్నారు. ముందుగా ఫోన్లలో పరిచయం చేసుకుంటారు. మాయ మాటలు చెప్తారు. వివరాలు ఆరాతీస్తారు. సులభంగా డబ్బులు మాయం చేస్తున్నారు. ఖాతాల్లో నగదు లేదని తెలుసుకున్నా బాధితులు లబోదిబోమంటున్నారు. బాధితులు పోలీసులకు ఫిర్యాదు చేస్తున్నారేగానీ రికవరీ అయిన దాఖలాలు లేవు.

**లక్కీ డ్రాలో కారు తగిలిందని...**

పుట్లూరు మండలం కడవకల్లుకు చెందిన ఓ విద్యార్థి గతేడాది ఆన్‌లైన్ షాపింగ్‌లో టీ షర్ట్ కొనుగోలు చేశాడు. ఈ లావాదేవీని ఆసరాగా చేసుకున్న సైబర్ నేరగాళ్లు లక్కీ డ్రాలో రెండో బహుమతి కింద రూ.7.34 లక్షల విలువైన కారు తగిలిందని నమ్మబలికారు. షాప్‌క్లూస్ 12వ వార్షికోత్సవం సందర్భంగా టీ షర్ట్ కొన్నందున మీకు ఈ సువర్ణ అవకాశం లభించిందని చెప్పారు. కారు సొంతం కావాలంటే కొంత డబ్బు పంపాలని చెప్పి, గూగుల్‌పే ద్వారా దాదాపు 19 విడతల్లో మొత్తం రూ.3.11 లక్షలు లూటీ చేశారు. బాధితుడు పోలీసులకు ఫిర్యాదు చేసినా నేటికీ రికవరీ కాలేదు.

**కలెక్టర్ కార్యాలయం నుంచి ఫోన్ చేస్తున్నామని..**

- గార్లదిన్నె మండలం తిమ్మంపేటకు చెందిన మహిళకు ఇటీవల ఓ వ్యక్తి అనంతపురం కలెక్టరేట్ నుంచి ఫోన్ చేస్తున్నామని పరిచయం చేసుకున్నాడు. కోవిడ్ వల్ల మరణించిన వారికి రూ.50 వేలు ప్రభుత్వం ఇస్తుందని, తాము అడిగిన వివరాలు చెబితే రూ.2 లక్షలు వస్తాయని మాయమాటలు చెప్పాడు. బ్యాంకు ఖాతా వివరాలు రాబట్టాడు. రూ.60 వేలు ఆ మహిళ ఖాతా నుంచి మాయం చేశాడు. సదరు మహిళ గార్లదిన్నె పోలీసులకు ఫిర్యాదు చేసింది.

**ఏఎస్‌ఐ పేరుతో బురిడీ**

- పుట్లూరు మండలం కోమటికుంట్ల మీసేవ నిర్వాహకుడు మహేష్‌కు ఈ ఏడాది జనవరి 5న ఓ సైబర్ నేరగాడు నేను ఏఎస్‌ఐ అని ఫోన్లో పరిచయం చేసుకున్నాడు. మీ గ్రామంలోనే ఉన్నాను.. నావద్ద నగదు ఉంది.. ఫోన్‌పేలో డబ్బు పంపితే తిరిగి నీకు నగదు పంపుతానని చెప్పాడు. నా వద్ద నగదు లేదని చెప్పినా వినలేదు. ఏఎస్‌ఐని చెప్పినా వినవా? అని గద్దించాడు. దీంతో బాధితుడు తెలిసినవారి నుంచి రూ.23 వేలు బదిలీ చేయించాడు. అయితే అప్పటి వరకు ఫోన్‌లో మాట్లాడిన వ్యక్తి.. నగదు బదిలీకాగానే ఫోన్ స్విచ్ ఆఫ్ చేశాడు. దీంతో మోసపోయినట్లు గుర్తించిన మహేష్.. పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

**ఆధార్ అనుసంధానం చేయాలంటూ..**

- పుట్లూరు మండలం చింతకుంటకు చెందిన రాజా అనే వ్యక్తికి నెల రోజుల క్రితం ఓ అజ్ఞాత వ్యక్తి ఫోన్ చేశాడు. తన పిల్లల పేర్లు, వారు చదువుతున్న పాఠశాల పేరు చెప్పి అమ్మఒడి రావాలంటే ఆధార్ అనుసంధానం చేయాలని మాయ మాటలను చెప్పాడు. బ్యాంకు ఖాతా వివరాలతో పాటు ఓటీపీ చెప్పించుకొని రూ.12 వేలు మాయం చేశాడు.

**సైబర్ నేరాలపై అవగాహన కల్పిస్తున్నాం**



సైబర్ నేరాలపై గ్రామీణ ప్రాంతాల్లో ప్రజలకు అవగాహన కల్పిస్తున్నాం. ఇందులో ముఖ్యంగా బ్యాంకు ఖాతా వివరాలు, ఓటీపీ ఎవరికీ ఇవ్వరాదని సూచిస్తున్నాం. సామాజిక మాధ్యమాల్లో వచ్చే లింకులను ఓపెన్ చేసినా, సెర్చ్ ఇంజిన్లలో ఉన్న టోల్‌ఫ్రీ నంబర్లను సంప్రదించినా మోసపోయే అవకాశాలు ఎక్కువ. లక్కీడ్రాలు నమ్మి నగదు పంపరాదని తెలియజేస్తున్నాం. మోసానికి గురైన వారు వెంటనే పోలీస్ స్టేషన్‌లో, 1930కు ఫిర్యాదు చేయాలి.
– గురు ప్రసాద్‌రెడ్డి, ఎస్‌ఐ, పుట్లూరు

## లాటరీ పేరిట లూటీ

**ఖైరతాబాద్ వాసికి రూ.18 లక్షల టోకరా**

- రెండు నెలల్లో 4 ఇదే తరహా కేసులు
- నగరంలో రెచ్చిపోతున్న సైబర్ నేరగాళ్లు

**రెండు నెలల్లో నాలుగు కేసులు**



www.madhavareddy.org




## కేరాఫ్ బిహార్

## Hyd News: టీ షర్ట్స్ కొంటే.. రూ.3 లక్షలు హాంఫట్!



హైదరాబాద్: ఆన్‌లైన్ షాపింగ్‌తో బహుమతి గెలుచుకున్నారంటూ మాయగాళ్లు విసిరిన వలకు చిక్కిన యువకుడు రూ.లక్షలు పోగొట్టుకున్నాడు. జీడిమెట్లకు చెందిన ఓ యువ వ్యాపారి ఈ నెల 9న ఆన్‌లైన్‌లో రూ.432తో టీ-షర్ట్స్ కొనుగోలు చేశాడు. ఈ నెల 13న ప్రశాంతి, అలోక్‌కుమార్ సింగ్, సంజయ్‌శర్మ పేర్లతో ఫోన్ చేసి లక్కీ విజేతగా రూ.6.20 లక్షలు గెలుచుకున్నట్లు చెప్పారు. ఆ డబ్బు కోసం ఎన్‌వోసీ, టీడీఎస్, ఆదాయ పన్ను, కన్వర్‌జేషన్ ఛార్జీల పేరిట మోసగాళ్లు డబ్బు తమ ఖాతాల్లో జమ చేయించుకున్నారు. నగదు బహుమతి రూ.10.41లక్షలు సొంతం చేసుకోవాలంటే అదనంగా రూ. 1,09,000 చెల్లించాలని.. తిరిగి ఆ డబ్బు వెనక్కి ఇస్తామంటూ నమ్మించి మొత్తం రూ.3,21,200 కొట్టేశారు. సైబరాబాద్ సైబర్‌క్రైమ్ పోలీసులు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

# Cyber Crimes (Matrimony)

## నయవంచక భరత్‌రెడ్డి



విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న ఎస్పీ బి.సత్యయేసు బాబు


అరెస్టయిన భరత్ రెడ్డి, స్వాధీనం చేసుకున్న సెల్‌ఫోన్, గంజాయి

అనంతపురం క్రైం: క్రికెట్ బెట్టింగ్.. పేకాట.. ప్రేమ, పెళ్లి ముసుగులో దగా.. 126 నగ్న ఫొటోలు, వీడియోలతో రూ.5లక్షల వరకు వసూలు.. గంజాయి వ్యాపారం.. ఇలా ఒకటేమిటి, ఎన్నో విధాల మోసాలకు పాల్పడుతున్న ఓ నియవంచకుడిని జిల్లా పోలీసులు ఎట్టకేలకు అరెస్టు చేశారు. కేజీ గంజాయి, సెల్‌ఫోన్, ద్విచక్ర వాహనాన్ని స్వాధీనం చేసుకున్నారు. గురువారం నగరంలోని డీపీఓలో ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో ఎస్పీ బి.సత్యయేసు బాబు వివరాలను వెల్లడించారు. నగరంలోని భైరవనగర్‌లో నివాసముంటున్న భరత్ రెడ్డి బీటెక్ మూడో సంవత్సరం వరకు చదివి.. ఆ తర్వాత బీఎస్సీ కంప్యూటర్స్ పూర్తి చేశాడు. క్రికెట్ బెట్టింగ్, పేకాట కు బానిసయ్యాడు. సరిపడా డబ్బులు, సంపాదన లేకపోవడంతో నూతన పంథా ఎంచుకున్నాడు. ఫేస్‌బుక్, టిండర్ యాప్, తెలుగు మ్యాట్రిమోనిలలో ఫేక్ ఐడీలతో అకౌంట్లు సృష్టించాడు. వీటిలో భరత్ రెడ్డి పేరుకు బదులుగా సిద్ధార్థ రెడ్డి అని పేరు.. అతని ఫొటోకు బదులుగా ఓ అందమైన వ్యక్తి ఫొటోను ప్రొఫైల్‌గా పెట్టుకున్నాడు. అలా అమ్మాయిలను పరిచయం చేసుకుని నిరంతరం వాట్సాప్ చాటింగ్, వాయిస్ కాల్స్ కొనసాగించాడు. ప్రేమిస్తున్నానని, పెళ్లి చేసుకుంటానని కొందరు అమ్మాయిలను నమ్మించాడు. పెళ్లి చేసుకుంటానని నమ్మించిన నగ్న దృశ్యాలు, రికార్డులు సేకరించాడు.

**మోసపోయిన 20 మందికి పైగా యువతులు**

ఫేస్ బుక్, టిండర్ యాప్, మ్యాట్రిమోనీ ద్వారా హైదరాబాద్, బెంగళూరు, తిరుపతి, విజయవాడ, ప్రొద్దుటూరు, ధర్మవరం, తాడిపత్రి ప్రాంతాలకు చెందిన యువతులను మోసం చేశాడు. అమ్మాయిల నుంచి సుమారు రూ.5 లక్షల వరకు డబ్బును తన బ్యాంకు అకౌంట్లు, ఫోన్ పే, గూగుల్ పే ద్వారా రాబట్టుకున్నాడు. ఇలా సుమారు 20 మంది అమ్మాయిలు భరత్ వలలో మోసపోయారు. వీరిలో ఉన్నత విద్యను అభ్యసించిన యువతులు.. సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లు కూడా ఉండటం గమనార్హం.

**రహస్యంగా నగ్న వీడియోల చిత్రీకరణ**

అమ్మాయిలు, మహిళలు స్నానం చేసే సమయంలో దొంగచాటుగా వెళ్లి నగ్న వీడియోలు చిత్రీకరించాడు. దీంతో పాటుగా గంజాయి తక్కువ ధరకు కొనుగోలు చేసి అధిక ధరతో విక్రయిస్తూ సొమ్ము చేసుకుంటున్నాడు. ఇతనిపై ఇప్పటికే అనంతపురం వన్‌టౌన్‌లో కిడ్నాప్ కేసు, టూటౌన్‌లో గ్యాంబ్లింగ్ కేసులున్నాయి. అనంతపురం రైల్వే స్టేషన్ వద్ద గంజాయి విక్రయిస్తున్న భరత్ రెడ్డిని గురువారం పోలీసులు అరెస్టు చేశారు. దిశ డీఎస్పీ ఎ.శ్రీనివాసులు విచారణలో నయవంచన బాగోతం వెలుగు చూసింది. విలేకరుల సమావేశంలో ఏఎస్పీ నాగేంద్రుడు పాల్గొన్నారు.

**ఫేక్ అకౌంట్లతో అమ్మాయిలకు వల**

- ప్రేమ, పెళ్లి పేరుతో నగ్న ఫొటోలు, వీడియోల సేకరణ
- బాధితుల్లో పలువురు సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లు
- క్రికెట్ బెట్టింగ్, పేకాటతో అడ్డదార్లు
- గంజాయి విక్రయాలతో దందా

**అపరిచిత వ్యక్తులతో స్నేహం ప్రమాదం**

సామాజిక మాధ్యమాల్లో ఫేక్ అకౌంట్ల ద్వారా అమ్మాయిలను వంచించడం పరిపాటిగా మారింది. వాట్సాప్ చాటింగ్‌లు, వాయిస్ కాల్స్ చేసేటప్పుడు అప్రమత్తంగా ఉండాలి. అపరిచిత వ్యక్తులతో స్నేహం ప్రమాదమని గుర్తించాలి. భరత్ రెడ్డి బాధితులెవరైనా ఉంటే దిశ డీఎస్పీ ఎ.శ్రీనివాసులను సంప్రదించండి. మహిళల చేతిలో వజ్రాయుధమైన దిశ ఎస్ఓఎస్ యాప్‌ను ప్రతి ఒక్కరూ డౌన్‌లోడ్ చేసుకోవాలి.

– బి.సత్యయేసుబాబు, ఎస్పీ

## ఈమె నిత్యపెళ్లికూతురు

- పోలీసులకు మూడో భర్త ఫిర్యాదు


నిధాఖాన్

మైసూరు: టిండర్ యాప్ ద్వారా పురుషులతో పరిచయం ఏర్పర్చుకుని ప్రేమ పేరుతో దగ్గర కావడం, ఆపై పెళ్లి చేసుకుని కొన్నాళ్లకు విడిపోవడమే పనిగా పెట్టుకుంది. మూడో భర్త ఆమె నిర్వాకాలపై పోలీసులకు ఫిర్యాదు చేశాడు. వివరాలు.. మైసూరులోని ఉదయగిరికి చెందిన నిధా ఖాన్ గత 2019లో బెంగళూరులో ఓ ప్రైవేటు ఆస్పత్రిలో పని చేసే అజామ్‌ఖాన్‌తో టిండర్ యాప్‌లో పరిచయం పెంచుకుని పెళ్లాడింది. కొన్నిరోజులకే నిధాఖాన్ ప్రవర్తన తేడాగా ఉండటంతో అజామ్‌ఖాన్ ఆరా తీశాడు. ఆమె అప్పటికే రెండు పెళ్లిళ్లు చేసుకుని విడిపోయిందని గుర్తించాడు. ఆన్‌లైన్లో మరికొందరు పురుషులతో చాటింగ్ చేస్తోందని మైసూరులోని ఉదయగిరి పోలీసులకు ఫిర్యాదు చేశాడు. మరో వ్యక్తితో ఉండగా రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకున్నట్లు తెలిపాడు. కేసు నమోదు చేసుకున్న పోలీసులు దర్యాప్తు చేపట్టారు.

www.madhavareddy.org

## పెళ్లంటూ నిండా మోసం

- నగదు, నగలు స్వాహా
- మైసూరులో కిలేడీ అరెస్టు


నిందితురాలు మేఘ

మైసూరు: పెళ్లి చేసుకుంటానని నమ్మించి యువకుని నుంచి లక్షలాది రూపాయల మేర నగదును, ఆభరణాలను దోచుకున్న కిలాడీ లేడీని మైసూరు మేటగళ్లి పోలీసులు అరెస్టు చేశారు. బెంగళూరు ఆంధ్రహళ్లి రెండో ప్రధాన రహదారిలో నివాసం ఉండే మేఘ అలియాస్ బిందుగౌడ (25) నిందితురాలు. ఈమె టెన్త్ చదివింది. ఫేస్‌బుక్‌లో చిన్నుగౌడ పేరుతో ఖాతా తెరిచి రవి అనే వ్యక్తితో స్నేహం ప్రారంభించింది. తన పేరు బిందు గౌడ అని చెబుతూ అందమైన ఒక అమ్మాయి ఫోటోలను రవికి పంపింది. తమకు మైసూరులో రెండు పెట్రోల్ బంకులు, బార్ ఉన్నాయని, నిన్ను ఎంతో ప్రేమిస్తున్నానని, పెళ్లి చేసుకోవాలని రవిని కోరింది. నీ పుట్టిన రోజుకు రూ. 45 లక్షల ఫార్చ్యూనర్ కారు బహుమతిగా ఇస్తానని, అందుకు ఒక రూ. లక్ష తక్కువగా ఉన్నాయని, ఆ డబ్బును తన స్నేహితునికి ఇచ్చి పంపాలని మాయమాటలు చెప్పింది. మీ అమ్మ మెడలోని గొలుసు చాలా అందంగా ఉందని, తనకెంతో నచ్చిందని, దాన్ని అదే స్నేహితునికి ఇచ్చి పంపిస్తే అదేమాదిరి డిజైన్‌ను తయారు చేయించి తిరిగి ఇచ్చేస్తానని మభ్యపెట్టింది.

**అన్నీ ఇచ్చాక ఫోన్ స్విచ్ఛాఫ్**

మేఘ మాయమాటలను నమ్మిన రవి ఆమె చెప్పినట్లుగా అన్ని చేశాడు. నగదు, బంగారు ఆభరణాలు ఇచ్చిన తర్వాత ఫోన్ చేస్తే మోసగత్తె మొబైల్ స్విచ్ఛాఫ్ వచ్చింది. దీంతో మేటగళ్లి పోలీసు స్టేషన్‌ను బాధితుడు రవి ఆశ్రయించాడు.. ఈ కేసును విచారించిన పోలీసులు బిందుగౌడను అరెస్టు చేశారు. విచారణ చేయగా, పెద్ద చీటర్ అని, 2018లో యోగానంద నుంచి రూ. 15 లక్షలు, శ్రీనివాస్ నుంచి రూ. 9.70 లక్షలను ఏమార్చి దోచుకున్నట్లు తేలింది.

## మాయలేడి

- పెళ్లిళ్ల పేరుతో నయవంచన
- సోషల్ మీడియాతో ధనవంతులకు వల
- మూడోసారి యూఎస్ వరుడికి లైన్
- కథ అడ్డం తిరగడంతో పరారీలో కిలాడీ

వరంగల్ నగరంలోని ఓ మాయ'లేడి' కథ ఇది.. సామాజిక మాధ్యమాలను అడ్డు పెట్టుకుని ఏకంగా మూడు పెళ్లిళ్లు చేసుకుంది. తన అందాన్ని ఎరగా చూపి ధనవంతులైన యువకులకు ఇంటర్‌నెట్ ద్వారా గాలం వేయడం.. పెళ్లి చేసుకున్నాక వారిపై అక్రమ కేసులు బనాయించి డబ్బు వసూలు చేయడం.. ఇదీ ఆమె వ్యవహారం.

వరంగల్ క్రైం : నగరానికి చెందిన ఆ కిలాడీ తన అందం, అభినయంతో ఫేస్‌బుక్, వాట్సాప్ (ఇంటర్నెట్) వంటి మాధ్యమిక సాధనాలలో అందమైన ఫొటోలను పోస్టు చేసేది. ఇంటర్నెట్ ద్వారా పరిచయం పెంచుకుంటూ తాను గొప్ప ధనవంతురాలిగా చెప్పుకునేది. అందమైన భవనాలను తన ఇల్లుగా, బాగా బంగారు ఆభరణాలు ధరించిన దంపతుల ఫొటోలను తల్లిదండ్రులుగా చూపించేది. 2010లో కాజీపేటకు చెందిన ఒక ధనిక యువకుడు మాయలేడి వలలో పడ్డాడు. పరిచయం ప్రేమగా మారింది. ఆ తర్వాత తన తల్లిదండ్రులకు ప్రేమ అంటే పడదని, బయట పెళ్లి చేసుకుందామని బలవంతం చేయడంతో అతడు అంగీకరించాడు. అయితే పెళ్లయ్యాక కొద్ది రోజుల్లోనే భర్త వేధిస్తున్నాడంటూ మహిళా పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేసింది. దీంతో యువకుడి కుటుంబ సభ్యులు కేసు రాజీ అంటూ విడాకులు తీసుకుని ఆ యువతికి రూ.10 లక్షలు చెల్లించారు. తిరిగి 2012లో హన్మకొండకు చెందిన మరో ధనిక యువకుడి పెళ్లి

- మిగతా 2లో



## మూడు నెలల్లో ఏడుగురితో వివాహం

డబ్బు, నగలతో మాయం • పోలీసులకు చిక్కిన హరియాణా యువతి

అనాథలా పరిచయం చేసుకోవడం.. మాయమాటలు చెప్పి పెళ్లి చేసుకోవడం.. మొదటి రాత్రే భర్తకు మత్తుమందు ఇవ్వడం.. అనంతరం డబ్బు, నగలతో పారిపోవడం.. మూడు నెలల వ్యవధిలో 7 సార్లు ఈ తరహా మోసాలకు పాల్పడింది ఓ యువతి. ఆమె వలలో పడి మొత్తం ఏడుగురు మోసపోయారు. చివరకు యువతితో పాటు ఆమెకు సహకరిస్తున్న ముఠాను పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. హరియాణాకు చెందిన ఆ యువతి పెళ్లికాని యువకులను, విడాకులు తీసుకుని మరో పెళ్లి చేసుకోవాలనుకునే వారిని లక్ష్యంగా చేసుకునేది. వారికి వలపు వల విసిరి పెళ్లి వరకు తీసుకెళ్లేది. వివాహం అయిన తర్వాత మొదటి రాత్రే భర్తకు మత్తుమందు మాత్రలు ఇచ్చి ఇంట్లో ఉన్న డబ్బు, నగలతో ఉడాయించేది. భర్తకు అనుమానం వచ్చేలోపే ముఠాతో కలిసి ప్రణాళికను అమలు చేసేది. ఈ పథకం అమలు కాకపోతే.. కట్నం వేధింపుల పేరుతో భర్తను బ్లాక్‌మెయిల్ చేసి డబ్బులు లాగేది. ఇందుకు ఆమె ముఠా సభ్యులు సహకరించేవారు. ఈ గ్రూపులో ఓ మ్యారేజ్ ఏజెంట్, నలుగురు పురుషులు సహా ముగ్గురు మహిళలు కూడా ఉన్నారు. ఆ యువతిని వివాహం చేసుకున్న నాలుగో వ్యక్తి ఈ వ్యవహారంలో పోలీసులను ఆశ్రయించడంతో వారి బండారం బయటపడింది.

# Cyber Crimes (Nude Calls)

## పట్టమంటాడు...
# వదలమంటాడు!

- సైబర్ పోలీసులకు చుక్కలు చూపిస్తున్న వైద్యుడు
- 2020 నుంచి 'లోకంటో క్రైమ్'కు బాధితుడిగా...
- అప్పట్లో నిందితులను పట్టుకోమని ఫిర్యాదు
- 2021లో చిక్కిన వ్యక్తిని వదిలేసే వరకు హంగామా
- న్యాయం చేయాలంటూ తాజాగా రాణా మెట్లు
- ఇప్పటి వరకు రూ.1.5 కోట్లు నష్టపోయిన బాధితుడు



సాక్షి, సిటీబ్యూరో: ఆన్‌లైన్ డేటింగ్ బానిసగా మారిన ఓ వైద్యుడు సిటీ సైబర్ క్రైమ్ పోలీసులకు చుక్కలు చూపిస్తున్నాడు. తనను మోసం చేసిన నిందితులను పట్టుకోవాలని రెండుసార్లు, పట్టుకున్న వారిని వదిలేయాలని ఓసారి ఇప్పటికే ఈ అధికారులను వేధించాడు. తాజాగా సోమవారం మరోసారి సిటీ సైబర్ క్రైమ్ ఠాణాలో ఫిర్యాదు చేస్తూ ఇప్పటి వరకు తన నుంచి రూ.1.5 కోట్లు కొట్టేసిన 'లోకంటో క్రిమినల్స్'ను కటకటాల్లోకి పంపాలని వేడుకున్నాడు. దీంతో కేసు నమోదు చేసుకున్న అధికారులు దర్యాప్తు ప్రారంభించారు.

- పద్మారావునగర్‌కు చెందిన వ్యక్తి (60) కేంద్ర సర్వీసులో వైద్యుడిగా గుజరాత్‌లో విధులు నిర్వర్తిస్తున్నాడు. కొన్నాళ్లుగా నగరంలోనే ఉంటున్నాడు.

ప్రకటనకు ఆకర్షితుడయ్యాడు. సైబర్ నేరగాళ్లు యువతుల ఫొటోలు అందులో పోస్టు చేసి సెల్ నంబరు ఇచ్చారు. డేటింగ్‌పై ఆసక్తి ఉంటే కాల్ చేయాల్సిందిగా సూచించారు.

- సదరు వైద్యుడు వారికి కాల్ చేయగా... కొందరు వ్యక్తులు మాట్లాడి ఆ ఫొటోలు ఉన్న యువతులు డేటింగ్‌కు సిద్ధమన్నారు. దానికోసం రిజిస్ట్రేషన్ చేసుకుని, కొంత మొత్తం అడ్వాన్స్‌గా చెల్లించాలంటూ తమ బ్యాంకు ఖాతా వివరాలు అందించారు.
- అలా ఆ ఏడాది జూన్ 6 నుంచి అతను 'చెల్లింపులు' మొదలెట్టాడు. ఈ కథను వాట్సాప్‌లోకి మార్చిన నేరగాళ్లు ఆ యువతులే చాట్ చేస్తున్నట్లు, మాట్లాడుతున్నట్లు నమ్మించారు. తమను కలుసుకోవాలంటే మరికొంత మొత్తం చెల్లించాలని చెప్పించారు.
- వైద్యుడు నమ్మేయడంతో దఫదఫాలుగా నగదు వేయించుకుంటూ వెళ్లారు. ప్రతి సందర్భంలోనూ చెల్లించిన మొత్తంలో కొంత రీఫండ్ అన్నారు. ఏ దశలో అయినా డబ్బు చెల్లించడం ఆపేస్తే ఏమాత్రం తిరిగి రాదంటూ బెదిరించారు.

రూ.41.5 లక్షలు. కొంత విరామం ఇచ్చి 2021 మార్చి వరకు మరో రూ.30 లక్షలు చె[...] చేశాడు. జీతంలో దాచుకున్న దానితో పా[...] అప్పులు చేసి, చివరకు ప్రావిడెంట్ ఫండ్ లో[...] తీసుకుని డబ్బు చెల్లించాడు.

- విషయం కుటుంబీకులకు తెలియడంతో [...]డుసార్లు ఫిర్యాదు చేయడంతో కేసు నమోదైం[...] దర్యాప్తు చేసిన అధికారులు గుజరాత్ ఢిల్లీకి [...]దిన నిందితుడిని అరెస్టు చేశారు. అతడి ఖాతా[...] రూ.18 లక్షలు పడినట్లు ఆధారాలు సేకరించా[...]
- నేరం అంగీకరించిన అతగాడు రూ.12 ల[...] తిరిగివ్వడానికీ ఒప్పుకున్నాడు. నెల అతడు జై[...] ఉన్న తర్వాత వైద్యుడు అడ్డం తిరిగాడు. తన[...] ఫోన్‌లో మాట్లాడి మోసం చేసిన వ్యక్తి గొం[...] ఇతడి గొంతు వేరుగా ఉన్నాయని, అతడి[...] డబ్బు తనకు వద్దన్నాడు.
- కేసును లోక్ అదాలత్‌లో రాజీ చేసి, నిందితు[...] వదిలి పెట్టే వరకు సైబర్ క్రైమ్ పోలీసులను [...]దైన శైలిలో వేధించాడు. ఆపై మళ్లీ ఇతడికి సై[...] నేరగాళ్ల నుంచి ఫోన్లు రావడం మొదలైం[...] యువతులు మాట్లాడటం, రీఫండ్ అంటూ చె[...]డంతో డబ్బు చెల్లించడమూ కొనసాగించాడు[...]
- ఈ కాలంలో మరో రూ.80 లక్షలు వరకు చె[...] చేశాడు. కనీసం ఇంటి ఖర్చులకు డబ్బు[...] స్థితికి చేరడంతో సమీప బంధువు విషయ[...] తెలుసుకున్నాడు. ఆయన ద్వారా సోమవా[...] సిటీ సైబర్ క్రైమ్ ఏసీపీ కేవీఎం ప్రసా[...] ఫిర్యాదు చేశాడు.
- వైద్యుడితో పాటు అతడి కుటుంబం పరిస్థి[...] పరిగణలోకి తీసుకున్న ఏసీపీ కేసు నమోదు [...] దర్యాప్తు చేపట్టాల్సిందిగా ఆదేశించారు. దీం[...] ఇన్‌స్పెక్టర్ ప్రశాంత్ నేతృత్వంలోని బృం[...]




www.madhavareddy.org

## డేటింగ్ యాప్ ఉచ్చులో బ్యాంక్ మేనేజర్

» యువతి ఖాతాకు రూ.5.70 కోట్ల బదిలీ



బెంగళూరు, జూన్ 24 (ఆంధ్రజ్యోతి): ఆన్‌లైన్‌లో పరిచయమైన యువతి వలలో చిక్కి ఓ బ్యాంకు మేనేజర్ ఏకంగా రూ. 5.70 కోట్లు ఆమెకు ముట్టచెప్పి అరెస్టయ్యాడు. ఈ సంఘటన బెంగళూరులో చోటుచేసుకుంది. పోలీసుల కథనం మేరకు.. హనుమంతనగర్ ఇండియన్ బ్యాంకు శాఖ మేనేజర్ హరిశంకర్, డేటింగ్ యాప్ ద్వారా 3 నెలల క్రితం ఓ యువతిని పరిచయం చేసుకున్నాడు. ఆమె అత్యవసరంగా డబ్బులు కావాలని కోరడంతో తన వద్ద ఉన్న రూ.12 లక్షలతో పాటు తన బ్యాంకులో ఒక ఖాతాదారు డిపాజిట్ నుంచి రూ. 5.70 కోట్లు ఓవర్ డ్రాఫ్ట్(ఓడీ) చేశాడు. ఆరు రోజుల వ్యవధిలో 136 సార్లు ఓడీ చేయడంతో ఉన్నతాధికారులకు అనుమానం వచ్చి ఖాతాలను పరిశీలించగా విషయం వెలుగుచూసింది. బ్యాంకు రీజనల్ మేనేజర్ డీఎస్ మూర్తి ఫిర్యాదు మేరకు హరిశంకర్‌తో పాటు అసిస్టెంట్ మేనేజర్ కౌసల్య, క్లర్క్ మునిరాజుపై హనుమంతనగర్ పోలీసులు కేసు నమోదు చేశారు. హరిశంకర్‌ను అరెస్టు చేశారు.

## అమ్మాయితో కాల్, రూ. 5 లక్షల వసూలు

బనశంకరి: సోషల్ మీడియాలో యువతి వలలో పడిన వ్యక్తి డబ్బు పోగొట్టుకుని ఇబ్బందుల్లో పడిన ఘటన ఉద్యాననగరిలో చోటుచేసుకుంది. ఒక యువకునికి వాట్సప్ ద్వారా యువతితో చనువు పెరిగి నగ్నంగా వీడియో కాల్ చేయగా, అమ్మాయి రికార్డు చేసి బ్లాక్‌మెయిలింగ్‌కు పాల్పడింది. పలుమార్లు డబ్బు ఇచ్చిన బాధితుడు, చివరకు డబ్బులు లేవని చేతులెత్తేశాడు. దీంతో మరికొందరు దుండగులు అతనికి కాల్ చేసి నీతో వీడియో కాల్స్ మాట్లాడిన యువతి చనిపోయింది, అందుకు నీవే కారణం అని బెదిరించడం మొదలుపెట్టారు. నీపై సీబీఐలో కేసు నమోదైందని చెప్పారు. ఒక జాబితా తీసుకుని అందులో అతని పేరును చేర్చి పంపించారు. ఇలా దశలవారీగా అతడి నుంచి రూ.5 లక్షలకు పైగా డబ్బు వసూలు చేశారు. వారి వేధింపులతో విరక్తిచెందిన బాధితుడు స్నేహితులతో కలిసి ఆగ్నేయ విభాగం సైబర్‌పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశాడు. యువతి, మోసగాళ్ల ముఠా కోసం పోలీసులు గాలింపు చేపట్టారు.

## డేటింగ్.. రూ.70 లక్షలకు వృద్ధ వైద్యుడి చీటింగ్

నారాయణగూడ, న్యూస్‌టుడే: ఆన్‌లైన్ డేటింగ్ యాప్ ద్వారా ఓ వృద్ధ వైద్యుడు రూ.70 లక్షలు మోసపోయాడు. హైదరాబాద్ సైబర్ క్రైమ్ ఏసీపీ కె.వి.ఎం.ప్రసాద్ కథనం ప్రకారం.. పద్మారావునగర్‌కి చెందిన ఓ వైద్యుడు(60) గుజరాత్‌లో పని చేస్తున్నాడు. 2020లో డేటింగ్ యాప్ డౌన్‌లోడ్ చేసుకున్నాడు. నంబర్‌కు ఫోన్ చేయగా.. తమ గ్రూపులో చేరాలంటే సభ్యత్వం, రిజిస్ట్రేషన్ అంటూ రూ.40 లక్షలు పిండారు. ఓ అమ్మాయి ఫోన్ చేయగా చాటింగ్ చేస్తూ..డబ్బులు లాగేసింది. ఇది తెలిసి ఆ వైద్యుడి భార్య, పిల్లలు సైబర్ ఠాణాలో ఫిర్యాదు చేశారు. అయినా ఆయన తీరు మార్చుకోలేదు. ఏడాదిలో రూ.70 లక్షలు సమర్పించుకున్నాడు. యాప్ నిర్వాహకులు మీ డబ్బు తిరిగిచ్చేస్తాం. దానికి కొన్ని ట్యాక్సులు చెల్లించాల్సి ఉంటుందని షరతులు విధించారు. మోసపోయానని గ్రహించి కుటుంబ సభ్యులతో కలిసి బుధవారం సైబర్ ఠాణాలో

Check below YouTube links to know more crimes

1) https://youtu.be/2vdduaf63VA
2) https://youtu.be/X_SsiNZBPOQ

- Students / Citizens are getting mentally disturbed due to blackmailing/morphing / in contact with an unknown person online, with this they are losing time/money/studies and sometimes lives also.
- Educational Institutes must realize that, and consider it as a threat. As they are losing students intern, if their students suffer physically / mentally / emotionally as it directly affects their studies.
- Like Vaccination for Corona, in a similar way, providing General awareness of Cyber crimes can mitigate the problem of Cyber threats (non-technical).
- Cyber victims hardly reveal and Future victims don't know how they could be trapped(More than 78 kinds of frauds (non-technical traps) are there.
- Earlier Criminals were in Railway stations / Bus stands/ Market places, now they are on the Internet (Mobiles).
- We were taught and we are guiding our kinds on dangers of knife/electricity/lizards but missing in creating awareness on cyber crimes at home / educational institutions!!

www.madhavareddy.org

- Here is the person's name Mr. Pothi Reddy Madhava Reddy, was graduated from NIT Warangal, creating "Awareness on Cyber Crimes "since 2014 relentlessly to all communities like students, professionals (IT & Non-IT), caste orgs, religion orgs, police(Civil, AR& CISF) personal with PowerPoint presentation (PPT).
- He conducted more than 100 awareness sessions on Cyber Crimes which includes the latest to more than 3000 Telangana Policeofficers through Hybrid (offline/Online) mode form Telangana Police academy (TSPA) on 28th Nov 2021
- For "Awareness sessions on Cyber crimes" in your Educational Intuitions/Organisations / Gated communities / Unions, you can reach on 9490244255

For Ready reference, you can click and watch below YouTube links

1)3000 Police officers across Telangana on "Awareness session on Cyber Frauds" through Hybrid (Off / Online) model on 28th Nov 2021 from Telangana state police Academy (TSPA) ..!
Link: https://youtu.be/3xb9yVMU2qo

2)IDream interview on Cyber Crimes
Link: https://youtu.be/TWUxIHtjUeA

3)In July 2021 @ Green field college, Ibrahimpatnam more than 300 attended
Link: https://youtu.be/rcTJrlsctVM

4)2019 IMPACT @ Harihara Kalabhavan Secbad more than 2000 attended
Link: https://youtu.be/OWrzhE9ng1k

5)2014 IMPACT @ Harihara Kalabhavan Secbad more than 1500 attended
Link: https://youtu.be/bmLLLBl1N-M

## Coach Profile

Name: Pothi Reddy Madhava Reddy
Qualification: B.Tech(NITW), MBA (C U)
Contact No: +91 94902 44255
EMail ID : zbpforall@gmail.com
Website : www.MadhavaReddy.org
Photo :@TSPA (TS Police Academy)



www.madhavareddy.org

## Few important Testimonies/ Appreciation Certificates for ready reference..!!



RBVRR TELANGANA STATE POLICE ACADEMY

CERTIFICATE

This is to certify that Mr. Pothi reddy Madhava Reddy, SDE, BSNL

has conducted the Session on "General Awareness on Cyber Frauds"

for 60 Officers in Offline Mode and 600 Officers on online Mode on 28.11.2021 from 11.00 AM to 1.00 PM

at RBVRR Telangana State Police Academy, Hyderabad.

Course Director　　　　Director



केन्द्रीय औद्योगिक सुरक्षा बल
CISF UNIT BHEL HYDERABAD
BHEL(R) HYDERABAD -500 032
040- 23021906, 23182297 (O)

विशाल बंगड़
VISHAL BANGARH
ASSISTANT COMMANDANT

E-42099/CISF/BHEL®/DO/PA/2018-　　　　Dated: 25th May 2018

Shri Madhav Reddy

Central Industrial Security Force, Unit BHEL (R), Hyderabad would like to place a record its appreciation to Shri Madhav Reddy of Zero Budgeting politics for accepting our invitation to be a resource person and for delivering valuable & informative lectures on "Social Media awareness" during Unit level programme held at CISF Unit BHEL (R), Hyderabad on 05th August' 2017.

All the participants appreciated and got benefited from your views on the subject.

Looking forward for your cooperation for the conducting such type of Training in future as well.

With regards.

(VISHAL BANGARH)
सहायक कमांडेंट
Asst Commandant
CISF Unit BHEL Hydera.

To
Shri Madhav Reddy.



SRI KRISHNADEVARAYA UNIVERSITY
ANANTHAPURAMU – 515 003, ANDHRA PRADESH, INDIA.

Prof. A. Krishna Kumari
M.Sc., M.Phil., Ph.D.,
REGISTRAR

Tel (O): 08554 - 255700
Fax: +91- 08554- 255805
Cell: +91- 9441244439
e-mail: registrar@skuniversity.ac.in

Certificate of Appreciation

I am happy to state that **Mr. Pothi Reddy Madhava Reddy** has conducted an Awareness Session on **"Cyber Frauds and Safe Usage of Social Media"** to our **Sri Krishnadevaraya University staff & students** on **11-Feb-2022** from **4.00 PM to 6.00 PM** at **Bhuvana Vijayamu Auditorium – Sri Krishnadevaraya University, Ananthapuramu – 515001.**

The session was very informative and provided lot of knowledge & awareness to our Staff & Students. The real life examples mentioned in the program clearly highlighted the critical need to have awareness on cyber crimes and social media safe usage for career and as well business. We are sure that this kind of program will be invaluable to anyone who attends it and plays a drastic role in reducing cyber crimes in future.

**Mr. P. Madhava Reddy** is a proven expert in handling cases of cyber crime in preventive manner by creating awareness and guiding those who are caught in this web world. I recommend every organization/ institute to arrange such session and provide awareness on cyber crimes to their employees / stake holders in all walks of life.

On behalf of Sri Krishnadevaraya University, I convey my thanks to **Mr. P Madhava Reddy** and wish good luck in all the future endeavors.

REGISTRAR
REGISTRAR
Sri Krishnadevaraya University
ANANTAPUR-515 003.



JAWAHARLAL NEHRU TECHNOLOGICAL UNIVERSITY ANANTAPUR
ANANTHAPURAMU - 515 002 (A.P.) INDIA.

Dr. M.L.S. Deva Kumar,
B.Tech., M.B.A., M.Tech., Ph.D.,
Professor
Officer In-charge of M.B.A.
NSS Programme Officer.

Phone & Fax : + 08554-230158
Mobile : + 91-9440285609 (P)
9866914042 (O)
e-mail : hod.mba@jntua.ac.in
devakumar.jntua@gmail.com
website : www.jntuamba.com

To
Dr.P.Madhava Reddy

Thank you very much for delivering an informative lecture as Guest Speaker on Awareness on **"Social Media"** held on 13-11-2019 at Department of Management, Jawaharlal Nehru Technological University Anantapur, Ananthapuramu.

It was really a splendid-presentation which exposed the students to how to make use of social media in a constructive way. Further the topic on **"zero budget politics"** provoked the student's community to bring a model on zero budget politics to nation. All the students appreciated and got benefited from your views on the subject.

Your years of experience, depth of understanding and your ability to present the topic in such an interesting and lucid manner made the day more inspiring one.

Wishing you a great time in future

Officer In Charge of MBA
Officer Incharge of M.B.A.
J.N.T. University, Anantapur
Ananthapuramu - 515 002.

Designed by: ALENTSOFT (https://alentsoft.com)- 81233-06926 ALENTSOFT